మ॥ కృతకృత్యు ల్భవదర్చనాంచితులు మా ♦ దృక్తాపవిచ్ఛిత్తి సం
తతబోధామృత సత్ప్రసక్తి వెస న ♦ త్యర్థంబుఁ గావించి య
ద్భుతమాహాత్మ్యముఁ గూర్చువా రగుట సం ♦ తోషంబుతో భక్తసం
తతిఁ ద్వద్భావనఁ బూజసేసెదను వృ♦ద్ధా! చంద్రమౌళీశ్వరా! 11

మ॥ తరమే నీమహిమం బొగిం బొగడ హ్మా ♦ ద్యప్రక్రియన్ భారతీ
శ్వర వైకుంఠసురాధినాథులకు న ♦ వ్వాణీరమేంద్రాణికా
సరసీజాక్షులకున్? జడుండ నగు నే ♦ సాధింతు నెప్పాట నీ
కరుణాలేశమ కోరువాఁడ ధృతగం ♦ గా! చంద్రమౌళీశ్వరా! 12

మ॥ మునులు న్నిర్జరులు న్ధరామరులు ధ ♦ ర్మ్యు ల్చక్రవర్తు ల్మహా
ఘనులౌ రాజులు వైశ్యసత్తములు స♦త్కారార్యు లయ్యంఘ్రిజుల్
ధనధాన్యాంచితులైరి నీభజన మ ♦ త్యర్థంబు సాగించి యం
చని పౌరాణికవాణి పల్కు మహనీ ♦ యా! చంద్రమౌళీశ్వరా! 13

మ॥ శితికంఠాయ! నమో నమోభగవతే ♦ శ్రీశైలవాసాయ తే
క్షితికన్యాపతి పూజితాయ, మహతే ♦ శీతాంశుచూడాయ తే
కృతకృత్యార్చితపాదుకాయ గురవే ♦ కీర్త్యంచితాంగాయ తే
స్తుతిపాత్రాయ నమోనమో యనుచు నెం♦తుం జంద్రమౌళీశ్వరా! 14

మ॥ శ్రుతిపారాయణముం గవిణ్ణుతి మహా ♦ రుద్రాభిషేకోత్సవం
బతిమోదావహపుష్పపూజనము ది ♦ వ్యానేకనైవేద్యసం
భృతి యొక్కొక్కెడ సోమవాసరమునం ♦ బెంపొందు నీకోవెలం
గృతకృత్యు ల్నినుఁ గొల్చి కాంచెదరు ము♦క్తిం జంద్రమౌళీశ్వరా! 15

శా॥ ఏ దేవళ్ల మొగంబుఁ జూడ; నిఁక నే ♦ నేమైననిన్వేడ; నీ
వే దిక్కంచు వచించువాఁడ; వినుతు ♦ ల్వేయేలనీవాఁడ; నీ
పాదాబ్జంబులు నమ్మినాఁడ; మఱినీ ♦ వాదేల? నన్నన్న వాఁ
డా! దర్వీకరలోకపాలక కలా ♦ పా! చంద్రమౌళీశ్వరా! 16

శా॥ జ్యోతిష్టోమములన్ ఫలింపని ఫల ♦ స్తోమంబు ; దీవ్యన్నదీ
ప్రాతస్స్నానములం బొసంగని మహా ♦ రాజ్ఞీకటాక్షంబు వి
ఖ్యాతక్షేత్ర తపోవిశేషము లొసం ♦ గంబోని మోక్షంబు, నం
ధ్యా తాదాత్మ్య సమర్చనం గను నరుం ♦ డౌఁ జంద్రమౌళీశ్వరా! 17

శా॥ నీపాదాంబుజసేవ మానను మది ♦ న్నీధ్యానమున్వీడ, నీ
వా పాలుండవు దేవులందు మఱి నే ♦ నా! పాలుఁడ న్మర్త్యులన్
నీపారమ్య మెఱింగి వెంటఁబడితి ♦ న్నే నేరిఁ బ్రార్థింప నీ
ప్రాపుంగోరితి నన్నుఁ బ్రోవఁగదె రు♦ద్రా! చంద్రమౌళీశ్వరా! 18

శా॥ అంచద్రీతి నటించుమామక మనో♦హంసంబు జేపట్టి యు
త్కృంచిద్భృతిని మాంచి నీచరణ పం ♦ కే జాతముం దార్పఁగా
నెంచంగా వలెఁ ద్వత్కటాక్షకలనా ♦ హేవాక పాకప్రథన్
మించంగా వలె నీదుభక్తుఁడను మం ♦ త్రీ చంద్రమౌళీశ్వరా! 19

శా॥ బంటుంగా నను నేలికొమ్మనుచు నిన్ ♦ బల్మాఱుఁ బ్రార్థించి క్రే
గంట న్నీవు కృపారసం బొలుక నేఁ ♦ గంటి న్మహాదేవ! నీ
కంటె న్మిన్న జగానలేఁడనుచు దీ ♦ క్షం జాటుచున్నాఁడ ము
క్కంటీ! నేను కృతార్థసత్తముఁడఁ ద్రత్య♦క్షా! చంద్రమౌళీశ్వరా! 20

శా॥ ప్రాతస్స్నానమునన్ విభూతి ధరియిం ♦ పన్ మాలికల్గొల్వ వి
ఖ్యాతస్తోత్రములం బఠింప నతుల ♦ త్యంతంబొనర్ప న్గుణో
ద్భాతి న్వైదికపూజసేయ మఱియే ♦ పుణ్యంబులార్జింప నీ
చేతోమోదముకల్గు టేమిట నగున్ ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 21

మ॥ అభయంబిచ్చు సమస్తభక్తతతికి ♦ న్దాయుర్యశోభాగ్యముల్
విభవంబుల్ సముపార్చు నీకరుణ యు ♦ న్విఖ్యాతి విన్నాఁడ నో
యిభచర్మాంబర! వందనంబులివె నా ♦ కెంతేజయంబిచ్చి యీ
శుభవాక్యాప్తిని తృప్తిఁ జేకొనుము భి♦క్షూ! చంద్రమౌళీశ్వరా! 22

శా॥ వేదాంతార్థ మెఱింగిన న్నిగమసం ♦ వేద్యంబు సాధించిన
న్నోదం బేదఁగ నష్టకష్టముల నా ♦ మోదించి సన్నిష్ఠమై
పాదాంగుష్ఠము మోపి భూస్థలిని ని ♦ ల్వంజాలిన న్జేర్చునీ
శ్రీదాక్షిణ్యములేక సిద్ధికలదే? ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 23

మ॥ సవము ల్సేసినఁ, గుండలంబులను దీ ♦ క్షం బూనినన్ శాస్త్రవా
దవిధానంబుల నెగ్గినన్ నిఖిలవే♦దశ్రేణి భావార్థము
త్సవ మొప్ప న్వినిపించిన న్గురుకటా ♦ క్షం బింతలేకున్న, నీ
శివతత్త్వం బెఱుఁగంగఁజాలరు గదే? శ్రీచంద్రమౌళీశ్వరా ! 24

మ॥ నను రక్షించెడు దాత నీవని మహా ♦ నందంబుతో నిన్నె నా
మనమందెంచి భవత్పదాంబుజము శం ♦ భద్భక్తి నర్చించు చుం
టిని నావిన్నప మాలకించి కలసం ♦ దేహంబు బోకార్చి యొ
య్యన నీభక్తుని నన్నుఁబ్రోవఁదగు న♦య్యా! చంద్రమౌళీశ్వరా! 25

మ॥ సతతంబున్ స్థిరభక్తిఁ దావకపదా ♦ బ్జంబర్థిఁబూజింప ను
ద్యతుఁడౌ వాఁడఘపూరితుండె యయి నం♦దాల్మిం గటాక్షింతువన్
కతలాలింపఁగ వేదపారగులు వ ♦ క్కాణింప నామానసం
బతిమోదంబు వహించెఁ బ్రోవగదె యా♦ర్యా!చంద్రమౌళీశ్వరా!26

మ॥ తనసంతోషము సర్వలోకసుఖ సం ♦ తానంబ యౌ నిద్ధరన్
దన దుఃఖంబెఁ గుజాండభాండ నికరో ♦ ద్యద్దుఃఖ సంపాదియౌఁ
దన వైదుష్యము దివ్యబోధకల నా ♦ ర్థ ప్రాపకం బౌనటం
చును నెవ్వాఁడువచించు సంభృత♦సుధాంశూ!చంద్రమౌళీశ్వరా! 27

మ॥ ఇలువేల్పై యలరారు నీదు పదమే ♦ యాద్యంబు మావంగడం
బుల నేబాలునకైన నఁ గాని యిదె మా ♦ పుణ్యం బగణ్యంబు నీ
చలువం జేసి సమస్తసౌఖ్యముల న ♦ శ్రాంతంబుఁ బెంపొందుమ
మ్ములఁ ద్వత్కింకరపంక్తి నెక్కఁగొను మ♦య్యా చంద్రమౌళీశ్వరా!28

శా॥ మున్నాదక్షుఁడు మూర్ఖుఁడై నినుఁ గడు ♦ న్నోర్మిమోటమున్వీడితా
నెన్నన్రాని దురుక్తులాడి కులమం ♦ దెప్పాట హీనుండవౌ
దన్న న్వాని మదం బణంచి కృప న ♦ త్యర్థంబు రక్షించి తీ
వున్నారే? సురలెందుఁద్వత్సములు బా♦బూ! చంద్రమౌళీశ్వరా! 29

శా॥ లోకంబుల్ద్రుటిలోన ముంపఁగను గ ♦ ల్లోలావళుల్ పెంచి భూ
మ్యాకాశంబులు ఘూర్ణిలన్ గరిమ న ♦ వ్యోమాద్రి నుప్పొంగుభీ
మాకారంబునుగాన్న గంగఁ ద్రిజగ ♦ ద్వ్యాస న్నివారింపఁగా
నీకేశాటవిఁ గట్టుకట్టితి వత ♦ స్త్రి చంద్రమౌళీశ్వరా! 30

మ॥ అమృతంబుం దెగఁద్రావఁగా నమరుల ♦ త్యాసక్తిమై వచ్చి సం
భ్రమముం జెందిరిగాని, లోకహితము ♦ న్భావించి హాలాహలం
బమితం బొక్కరు మ్రింగఁజాలిరె త్రిలో ♦ కాధీశ! విశ్వాతిశా
యిమహత్వం బది లేదొకొండ్లకుఁ గపా♦లీ! చంద్రమౌళీశ్వరా! 31

శా॥ మాపున్ రేపునుఁ ద్వత్పదాబ్జరస ము♦ న్మత్తత్వముం గూర్ప నా
శ్రీపత్యబ్జభవాదిదేవతలు సు ♦ శ్రీభోగ సంపత్తి యె
ప్డేపాటన్ క్షణభంగురంబనుచు నె ♦ న్నేసార్లు నిందించి నీ
ప్రాపుందాపు గణింత్రు నెమ్మది సురూ ♦ పా! చంద్రమౌళీశ్వరా! 32

మ॥ పరమేష్ఠిత్వముఁ గేశవత్వము సుప ♦ ర్వాణాధిపత్యం బిలా
సురభావం, బమరత్వముం, బితృత, భి ♦ క్షుత్వంబు, యక్షత్వమున్
ధరణీశత్వము, సర్వదక్షత, యని ♦ త్యం బెన్న సౌఖ్యంబులే
దరయన్ నీపదభక్తి ముక్తినిడు సూ ♦ ద్యా! చంద్రమౌళీశ్వరా! 33

మ॥ మతిమన్ముఖ్యులు శాస్త్రవేత్తలు మహా♦మాన్యుల్ చతుర్వేద సం
తతు లష్టాదశసత్పురాణము లనం ♦ తంబుల్ స్మృతుల్ శాస్త్ర స
మ్మతి నర్థమ్ము లెఱింగి భక్తతతి సం ♦ భావించి నీసేవ సం
తతమోదావహ యంచుఁ దెల్పిరి మహా♦త్మా! చంద్రమౌళీశ్వరా! 34

శా॥ పన్నిండేఁడు లపత్యముం బడయ నిర్ ♦ బ్రార్థించి శ్రీకృష్ణుఁడు
ద్యన్నిష్ఠం దపమాచరింప సుతు ది ♦ వ్యశ్రీయుతుం గూర్చు నీ
కన్న న్మిన్న జగాన లేఁడనెడి ప్ర ♦ ఖ్యాతిం దగం గంటి వో
యన్నా! యెందునునీకునీవెసరియా ♦ గాఁ! జంద్రమౌళీశ్వరా! 35

శా॥ ఒక్కం డర్చితుఁ జేసె బూజిడుచు వే ♦ ఱొక్కండు ఱాల్దెచ్చి తాఁ
జక్కంబూంచె మఱొక్కఁ డెంతయును నో ♦ జన్ బిల్వలక్షార్చనల్
పెక్కుల్గూర్చి భజించె నొండను ఫలా ♦ పేక్షన్స్మృతి న్మెచ్చుచున్
గ్రుక్కంబుక్కిటిమాంసమిందఱునుము ♦ క్తుల్ చంద్రమౌళీశ్వరా!36

మ॥ ఘనమోహాంధ్యమ దొక్కరాజునకు వే ♦ డ్కంగూర్చె సత్పుత్రిపై
మన మారాటముఁ జెందెఁ బుత్త్రికయు న ♦ మ్రంబోనిదై చేరి ని
న్ననుకంపాంచితుఁ గొల్చె మల్లెలను దా ♦ హాయిన్ననె న్మల్లికా
ర్జునవిఖ్యాతి గణించి తీవటు నిచే ♦ రూ! చంద్రమౌళీశ్వరా! 37

శా॥ తల్లిందండ్రులు లోకర్తు బాలికను బో ♦ ధల్సేసి యుఁదుంచి దా
రెల్లన్ శ్రీగిరికేగఁ గుంచమునుఁబా ♦ లేవేళ నీకిచ్చుచున్
జెల్లంబో నినుగొల్వ వారొలసి దా ♦ ని న్నమ్మకే కొట్టరాన్
మెల్లన్నీ దరిఁజేరఁ బ్రోచితివి వ ♦ ర్మీ! చంద్రమౌళీశ్వరా! 38

మ॥ మతవైరుధ్యము లేటికో? యుపనిష ♦ న్మార్గభ్రమం బేటికో?
వితతార్థేచ్ఛ లవేటికో? పుడమి దు ♦ ర్విజ్ఞాను లౌటేటికో?
మితమోగస్థిత్తు లేటికో? కపటసం ♦ భేదాఢ్యు లౌటేటికో?
కృతకృత్యుల్గన రీవిధంబులఁ బినా ♦ కీ! చంద్రమౌళీశ్వరా! 39

మ॥ గురువై తానుపదేశ మీయనగు బ ♦ ల్కుందేనె జాల్వార దు
ర్భర మజ్ఞానముపీడ శిష్యులకు ని ♦ ర్వాణప్రదార్థంబు నా
ర్వారఁ బోదోలుటయున్ ఘటింపనగుఁ గో ♦ ర్కుల్దీఱ మోక్షేచ్ఛుఁడౌ
గురుఁడొక్కండులభింపఁడెయ్యెడలమా ♦ కుం చంద్రమౌళీశ్వరా! 40

శా॥ వేదాంతంబఁట యుచ్చఁగూర్తురఁట యు ♦ ర్వింగొంద ఱాచార్యులై
పాదాంభోజ జలంబు లిత్తు రఁట దా ♦ ర్భాగ్యంబు దేవార్చనం
బీఁదర్ రాదని హెచ్చరింతు రఁట హా! ♦ యింకెట్లు నీపూజ లీ
మీఁదంగల్గుఁ దరింత్రుమానవులు స్వా ♦ మీ చంద్రమౌళీశ్వరా! 41

మ॥ కలి మాయంబడి వేదచోదిత విధు ♦ ల్గావింపఁగానేర కే
యలసు ల్గొందఱు, తత్త్వవేత్తలము చుం ♦ డాయంచుఁ గర్మంబు ని
మ్ములమాయింతురు గాని, భోగ్యవిషయ ♦ మ్ముల్ వీడఁగా లేరు సొ
మ్ములనార్జింతురు ముక్తిఁగాంతురె కుశం ♦ భూ! చంద్రమౌళీశ్వరా! 42

శా॥ శాక్తాచారమె ముక్తిదంబని లస ♦ చ్ఛబ్దార్థవాగ్ధోరణిన్
శాక్తేయు ల్వచియింత్రు వైష్ణవులు శా ♦ స్త్రప్రక్రియ న్వైష్ణవ
ప్రోక్తం బయ్యది యంద్రు శైవు లదియె ♦ పూర్ణ శైవభాష్యాంచిత
వ్యక్తింజేసి త్వదీయ మంత్రాదిమొ శ ♦ ర్వా! చంద్రమౌళీశ్వరా! 43

శా॥ సందేహంబులుగూర్చువాదము లవి ♦ శ్వాస్యంబులౌట న్మనం
బందగ్గింపక న్యాయ్యమార్గ మిదె నీ ♦ యం దైక్యభావం బటం
చుం దాత్పర్యమున న్మెలంగి యొకవో ♦ శుష్కించుమర్త్యభ్రష్టసా
చందంబందఁ జొరండు ముక్తుఁ డలికా ♦ క్షా! చంద్రమౌళీశ్వరా! 44

శా॥ ఎన్నో మూర్తుల నెన్నొ రీతులను ని ♦ న్నే శాస్త్రరాద్ధాంత సం
పన్ను లూహించిన నీదువ్యక్తులనియే ♦ భావింతు సవ్వాని వే
ఋన్నే? సర్వగతుండ వీవగుటచే ♦ నుత్సాహసంపత్తి నో
యన్నా! నీభజనంబువీడ గిరివా ♦ సా! చంద్రమౌళీశ్వరా! 45

శా॥ సత్యం బేమరఁజేసి ధర్మము నెడ ♦ న్సంకోచముం గాంచఁజే
సత్యంతాదర ముంచు నేని భవదీ ♦ యాకారమండెప్డు సా
హిత్యశ్రీ భవదర్చకోత్తముల సా ♦ మ్మే తాను నీవాఁడె సాం
గత్యార్హుండు త్వదీయభక్తుఁ డనలా ♦ క్షా! చంద్రమౌళీశ్వరా! 46

మ॥ అసురానీకము బారి కోర్వక సురల్ ♦ త్వద్ఘంబు గోరీశ! మా
పస దూలె న్గలిఁ బ్రోవుమంచును భవ ♦ త్పాదాంబుజాతద్వయి
న్వేసఁగోల్వన్ దనుజావలిన్దునిమి వే ♦ వే భద్రముల్గూర్చి తీ
వసముం బెంచితి వెల్లలోకముల నూ♦ర్యాక్ష! చంద్రమౌళీశ్వరా! 47

మ॥ శివ! శంభూ! నగజామనోహర! హరా! ♦ శ్రీకంఠ! విశ్వేశ్వరా!
సనసా థా! వృషభాశ్వ! శంకర! మహే♦శా! శాంత! మృత్యుంజయా!
భవ! భక్తార్తివినాశ! శర్వ! కరుణా ♦ పాథోధి! భూతేశ! రు
ద్ర! వరిష్ఠా! కరుణించి ప్రోవుము వెజో♦తల్, చంద్రమౌళీశ్వరా! 48

శా॥ శ్రీరామామణి సేవితాంఘ్రికమలా! ♦ శ్రీకంఠ! విశ్వేశ! యోం
కారాకార! పవిత్రనామ! వృషభాం ♦ కా! దేవదేవా! ప్రభూ!
పారావారనిషంగ! శంకర! కృపా ♦ పాణీ! నన్నిట్లు సం
సారాంభోనిధి ముంపఁగా నగునె? యీ♦శా! చంద్రమౌళీశ్వరా! 49

శా॥ యుక్తాయుక్త వివేకశూన్యత సము ♦ ద్యోగంబు రోగంబుగా
సక్తి న్నేమది నెంచి దాస్యము నిర ♦ స్యంబంచు లోనెంచకే
ముక్తిం గూర్చు నటంచుఁ బొల్పడితి సా♦మ్యుంగోరి యీపాట్లకై
భక్తత్రాణధురీణ! చూడుము భరిం♦పం జంద్రమౌళీశ్వరా! 50

మ॥ పరముం గూర్పఁగ నేన యుంటిభృతకో♦పాధ్యాయతంగాంచునుం
చు రహిం జొన్పి ఁ దాన జీవనము న ♦ క్షోభంబుగా నోప్పచుం
గర మానందమొసంగఁ బూర్వభవసం ♦ స్కారంబునం జేసి యు
ష్కర పత్నీవ్యధ గల్గె దీన బడలిం ♦ తో చంద్రమౌళీశ్వరా! 51

మ॥ క్షితి నెన్నండు భవత్సమర్చకుల పీ ♦ డింపంగ లేదిట్టిదు
ర్గతి నాకొక్కని కేల గల్గెనొకో? భా ♦ రం బెట్టుపోకార్చొ? సం
స్తుతులుం జేసెద వ్రాసెద న్మతియు నెం ♦ తో భక్తి నినొ ల్పెదం
గృతకృత్యుం బొనరించి ప్రోవవె నిషం♦గీ! చంద్రమౌళీశ్వరా! 52

మ॥ కలిగెం దావక సత్కటాక్షమున జో ♦ కన్నందనుం డొక్కఁ డెం
దుల కీతండు త్రిరాత్రమాత్రమున బ ♦ ల్దుఃఖంబు మాతృవ్యథా
కలన న్గాంచె దలంప నయ్యది యెఱుం♦గ న్వానిదో? నాదో? యీ
ఫల మెల్లేనగు నిద్దఱం గలఁప న ♦ ప్పా! చంద్రమౌళీశ్వరా! 53

శా॥ ఎవ్వం డేని భవత్కటాక్ష మెపుడె ♦ ట్లేఁ గోరి యీరీతిఁ దా
నొవ్వం డంచు నెఱుంగుదు న్దురిత మెం ♦ తో యింతకార్జించి నే
నొవ్వంగంటిని దీని నీ మెలువున ♦ న్మగ్గాడుదుంగాని న
న్నవ్వం జేయుము పుత్త్రిఁబ్రోచు నెఱినా ♦ న్నా! చంద్రమౌళీశ్వరా!54

శా॥ ఓకారుణ్యపయోధి! నీకరుణ నె ♦ న్నో సౌఖ్యము ల్గాంచి సు
శ్లోకుం డై యలరారుఁ గాతమని బా ♦ లు న్నాసుతు న్వేడ్కమై
శ్రీకంఠాఖ్యుఁ బొనర్చితిన్ మఱవకో ♦ శ్రీకంఠ! నీదాసు న
వ్వీఁకన్మమ్ము భరింప నీవసుమి యు ♦ ర్విం జంద్రమౌళీశ్వరా! 55

మ॥ ఒక సంవత్సర మేగెఁ బుత్త్రునకు నీ ♦ యుద్యత్కృపాదృష్టి నెం
తకు నే నిట్టులె చూడగాఁ దగుదు హృ ♦ ద్యప్రక్రియన్ భక్త పు
త్త్రకు నీకృత్యమ యిద్ది వేఱొకరి కి ♦ ద్దానన్ లవంబేని నెం
దుకు వాటిల్లుఁ బ్రసక్తి యిట్లనియె కొ ♦ ల్తుం జంద్రమౌళీశ్వరా! 56

మ॥ పరమప్రీతి నొసంగి తీవొకసుతు ♦ న్భవ్య న్భవన్నామ బం
ధురు శ్రీకంఠునిఁ బెంచుచుంటి విఁక నెం ♦ దు న్లోటురానీక సం
బరముం జెందుచు దాన, నీపదముల ♦ న్భావించి సేవించు చుం
టి రహిన్ శాశ్వతమిట్లుఁ బ్రోవు మనుచుం♦టిం జంద్రమౌళీశ్వరా! 57

శా॥ లగ్గుం గాంత్రు భవత్సమర్చకులు ధీ ♦ రశ్రేణి కొండాడఁగా
దగ్గు ల్వెచ్చులు లెక్కసేయక యె భ ♦ క్తవ్రాతముం బ్రోచు నీ
పగ్గె న్మెచ్చుచు బాలునేలుమని ని ♦ న్బ్రార్థింతు నేప్రొద్దు నీ
దగ్గుంజూచి భయాన మర్వకు మహా ♦ త్మా! చంద్రమౌళీశ్వరా! 58

శా॥ నీ పాదోదకము న్సభక్తిఁ గయికొం ♦ టి న్నీప్రసాదంబు నే
నాపోవన్భుజియించితి న్నుతులయం ♦ దాగూఢి నిన్గాంచితి
న్నీపేర్వెట్టితి మత్తనూజునకు నే ♦ నీలింగముం దాల్చితిం
బ్రాపై ప్రోవఁగ నేమియంతరము దే♦వా! చంద్రమౌళీశ్వరా! 59

మ॥ స్తుతి నారంభముసేసి యం దొకట నీ ♦ శ్లోభంబు వర్ణించి తీ
వళిదుష్టుండ వటంచు నెంచకుము నే ♦ నారాధ్యుఁడంగాన నిం
దితుఁడంగాను మతేరిఁగోర ననుఁ ♦ తిన్గానవే భక్తుఁడన్
ధృతి నన్గాచుట నీదుధర్మ ముపవీ ♦ తీ! చంద్రమౌళీశ్వరా! 60

మ॥ ఇలువేల్పువని విన్నయంత మన మొం ♦ తేఁ బ్రీతిఁ బొంగారు న
ర్మిలిఁ బాలింతు వటంచు దాన నిటుపే ♦ ర్మిం జిత్తగింపంగ మం
జులరీతి న్మొఱవెట్టితిం గసటుదె ♦ చ్చో లేదు మత్పూనునిం
గలకాలంబు భరింప నీవ సుమి త్ర్య ♦ క్షా! చంద్రమౌళీశ్వరా! 61

శా॥ భక్తి న్నీచరణాబ్జము ల్గొలుచు ని ♦ ష్ఠాపుండ నేఁగాన నా
సక్తి న్నీకడ నాచరిత్రముల స ♦ త్సందర్భశుద్ధి న్విసన్
దాసంగుల దయ ♦ న్వారించి పాలించు సం
రక్తిం దావకభక్తుఁడన్ శరణులు ♦ గ్రా! చంద్రమౌళీశ్వరా! 62

మ॥ జయముం గూర్తో? పరాజయం బిడుదో? యీ♦షల్లోపము ల్లేక నీ
కయి సద్భక్తిఁ బొనస్తు నీశతక మ ♦ య్యా! సత్కలాశూన్యుఁడన్
దయకుం బాత్రతఁ జెందఁగోరితి లస♦ద్దాక్షిణ్యభావంబు నా
కయి వెచ్చింప నొకింతచాలును ప్రాద♦య్యా! చంద్రమౌళీశ్వరా 63

మ॥ తొలుతంగల్గినపుట్టు లెట్టివొకో? నేఁ ♦ దోరంపుమోహాన నం
దులఁ గావించినకిల్బిషంబు లెవియో? ♦ త్రోవంగ నేఁజాల న
న్మలి నన్బ్రోవు మిదొక్కఁడే జననను ♦ న్నెంచుచుంటింగృపా
కలశాబ్ధి! న్నినుఁ గొల్చుమేల్మి వృషభాం♦కా! చంద్రమౌళీశ్వరా! 64

శా॥ గాత్రం బెంతకు నీక్షితి న్నిలుచు నట ♦ గారామునై నంతకుం
బాత్రత్వంబు ఘటించి నిల్పు కరుణా ♦ పాథోనిధానంబవై
స్తోత్రంబు ల్పచరించుచుందుఁ గొలుతున్ ♦ క్షోభంబువారించి సం
ధాత్రారూఢత ముక్తిఁగూర్పు గిరిధ ♦ న్వా చంద్రమౌళీశ్వరా!65

మ॥ కరపాదాదులు నైజసత్వమున వీఁ ♦ క స్వీయకార్యావళుల్
పరఁగం దా మొనరించుచున్నపుడె స ♦ ద్వ్యాపారదీక్ష న్నిరం
తరము న్గోష్ఠి నొనర్చఁగాఁదగును మా ♦ ర్తాండప్రకాశంబునం
దరయంగావలె గాదె యెల్లయును గు♦ల్యా! చంద్రమౌళీశ్వరా! 66

శా॥ సంతోషంబును జెందునప్పుడు మహా ♦ శ్చర్యాను సంధానమున్
సుంధైనం గనిన ప్డతీంద్రియసుఖ ♦ స్ఫూర్తుండనౌనాఁడు ని
శ్చింతత్వంబున యోగలక్ష్యమున వా ♦ సిం గాంచు నప్పట్లు ధ్యా
నింతు న్నాహృదయాబ్జపీఠమున మా ♦ నీ చంద్రమౌళీశ్వరా! 67

శా॥ ఎవ్వాండే సకలేశుని న్విడిచి య ♦ క్షేశాదులం గామ్యపుం
మవ్వాన న్భజియించు వాఁ డిహమున ♦ న్మాన్యత్వముం బాసి యం
దెవ్వల్పాపెడు రౌరవం బెనయు నం ♦ చేవింటి ప్రత్యర్థ మీ
వివ్వంజాలవా సర్వసౌఖ్యములఁ దం ♦ డ్రీ! చంద్రమౌళీశ్వరా! 68

శా॥ ఏదుర్బుద్ధివచించు నేయెడ సముం ♦ డీశానదేవుండు దా
నా దేవావలి కంచు నాతఁ డగున ♦ య్యా! మాలఁ డమ్మాలఁ డొం
డీదారిం గొనఁడేని గాఁడనియు నా ♦ హేమాద్రి నాదిత్యుఁడే
వాదింపం గని సంతసించితిని భ ♦ వ్యా! చంద్రమౌళీశ్వరా! 69

మ॥ కరుణావారిధిఁ జంద్రశేఖరు నుమా ♦ కాంతున్ మహాదేవు శం
కరు నిన్నెవ్వఁడు వీడి యన్య నిజహృ ♦ త్కంజంబునం గూర్చు నా
నరుఁ డొండొండన యెండమావులను గా ♦ నంగాంచి గంగాజలం
బు రహిన్వీరెడువాఁడయందురు మయో♦భూ! చంద్రమౌళీశ్వరా!70

మ॥ భవదీయాంశజనించువాఁడయిన స్వ ♦ ల్పంబైన యాయుష్యసం
భవభూతిం దనరారి తేఁడనని దు ♦ ర్వాదంబుల న్మించుచున్
శవణిల్లన్ క్షణమాత్ర సావ్వయుఁగ నా ♦ టన్నాశముం జేయుదో
శివ! నీ లేవ యవేద్య మేరికయిన ♦ స్సిరి చంద్రమౌళీశ్వరా! 71

మ॥ ప్రబలె న్నాస్తికధోరణు ల్స్ఫురితిమత ♦ ప్రారంభ సంరంభము
ల్పబువు ల్పాడమి నస్తమించెఁ గులము ♦ ల్పాడయ్యె వేదంబులన్
దబిసీల్సెసిరి దుర్భవు ల్మాటెయుఁ బు ♦ ణ్యక్షేత్రవర్గంబులం
దుబుకుల్వోడిరి సజ్జను ల్గతి యిఁకె ♦ ట్లో చంద్రమౌళీశ్వరా! 72

మ॥ గురుఁ బూజింపని శిష్యులు న్విబుధులం ♦ గొండాడఁగా లేని ము
ష్కరులుం బెద్దలఁ దద్దగొల్వని ప్రజా ♦ కాండంబు భక్తి న్నిర
స్తరము న్నాధుని సేవసేయని సతు ♦ ల్నానాఁటికి న్హెచ్చు దు
స్తరమాఁ ద్వద్భజనం బెఱుక్కలిఁ బ్రప ♦ ద్యా! చంద్రమౌళీశ్వరా!73

మ॥ కొలువంజాల సహస్రభాస్కరసదృ ♦ క్షు న్నిన్నుఁ బ్రాంతంబునం
బిలువం జాల మునీంద్రబృందవచనా ♦ విర్భూతు భూతాత్మకు
న్గొలువంజాల సమస్తవస్తుపరిపూ ♦ ర్ణీభూతు నిన్నెక్కటన్
నిలువంజాలుము మన్మనోబ్జమున ధ ♦ న్యా! చంద్రమౌళీశ్వరా! 74

శా॥ నీలింగంబును గాంచుఁ గన్నులలర ♦ న్నీసత్కథాశ్రేణిఁ దా
నాలించుం జెవులారి నిన్దలఁచు వి ♦ ద్యాస్థాన సంవేద్యుఁగాఁ
దూలంబాఱు విగర్హ్యవర్తనుల యుం ♦ దుం జూట్కి వాటిల్లు నీ
లీలం బొల్చుఁ ద్వదేకశీలుఁడు కపా ♦ లీ! చంద్రమౌళీశ్వరా! 75

మ॥ భవదీయామల సత్కథావళుల న ♦ ద్భంబైన సద్భక్తితోఁ
జెవులార న్వినిపించువారిఁ గొనునా ♦ శ్రీమంతులం గాంచి దు
ర్భవపంకాత్ములు వీరుగారని మహా ♦ రక్తిం బ్రశంసించి కా
లవశు ల్భూతలు మిన్నకేగెదరలో ♦ లా! చంద్రమౌళీశ్వరా! 76

శా॥ సర్వోత్కృష్టుఁడవై జయింపుము శివా! ♦ శంభూ! మృడా! శంకరా!
యుర్వీభృత్ప్రభుజామనోహర! నమ ♦ ద్యోగీంద్ర సంరక్షణా!
సర్వజ్ఞా! శశిఖండమండన! గిరీ ♦ శా! సత్కృపాక్షీరధీ!
శర్వా! జగ్గయపేటవాస! సకలే ♦ శా! చంద్రమౌళీశ్వరా! 77

మ॥ పరమోపాయకథాప్రసక్తిజడుఁడన్ ♦ భావంబు దుఃఖాత్మమా
శర ణ్యుంతే నొగి మోదె దాన శరణ ♦ స్థానంబు శ్రీచంద్ర శే
ఖరు నీశు న్నిను జొన్పితిం గరుణమైఁ ♦ గాపాడుమ మ్మిందిరా
వరనేత్రార్చిత! ధన్యత న్గనెద దే ♦ వా! చంద్రమౌళీశ్వరా! 78

మ॥ ఘనమై యంతటఁ బర్వ దృష్టికి మహా ♦ గాఢంబుగా మౌఢ్యసం
జ్ఞను దామిస్ర మడంప భాస్కరుని యో ♦ జన్నైజ తేజంబుతో
డను చెందంబను నాకసంబునఁ గడున్ ♦ డంబంబునన్ వేఁపు మో
గగనాధోత్తమ బింబమధ్యగతమూ ♦ ర్తీ! చంద్రమౌళీశ్వరా! 79

మ॥ శివ! నీమార్గముఁ జర్మదృష్టిని సమీ ♦ క్షింపంగ నేఁజాల నో
భవ! దానం గరుణాంచితంబభయద ♦ ప్రఖ్యాతమౌ చూడ్కి వే
గ విలోకింపఁగదయ్య మమ్ము నిను వే ♦ డ్కం గొల్తు మేప్రొద్దు సం
భవదుఃఖంబుఁబొకార్పు మొక్కలి వెయా ♦ మ్యా! చంద్రమౌళీశ్వరా!

మ॥ నెలదాల్! కృతి నీదురూపుపయి నెం ♦ తేఁ దోఁచె మున్సద్రి సం
కలితాలంకృతి సద్గణేద్య మని వక్కాణించి రాపైఁ గవుల్
కలుగుం బాలనుఁ దీపు పుట్టుక నె చ ♦ క్కం జక్కటిల్లార్ప న
వ్వల స్వారస్యము వృస్కఁజెందుగద దే ♦ వా! చంద్రమౌళీశ్వరా! 81

మ॥ సెకకంటీ! విసమాని యన్నెరి మృతిం ♦ జేకొంటివే? రుండమా
లికలం దాల్చి పవిత్రతన్ సడలితే ♦ లీలాభవాఖ్యుండవై
సకలక్లేశభవార్తిఁ బాపవె శుభా ♦ స్థంబెంపవే యట్లు బే
సికనుల్లగ్గినవాఁడవయ్య సమదృ ♦ ష్టిం జంద్రమౌళీశ్వరా! 82

మ॥ గిరిశా! శూలధరుండవయ్యును నిరో ♦ గిత్వంబుఁ గైకొంటివు
ద్ధుర వైరాగ్యరతుండవైన నినుఁ జెం ♦ దుగా రాగి భావంబు బం
ధురసద్భైక్ష్యచరుండవేని నిను నెం ♦ దుంజేరె నీశత్వ మీ
సరణి న్నీ చరితంబు చిత్రము నటే ♦ శా! చంద్రమౌళీశ్వరా! 83

మ॥ పరలోకోన్నతి ప్రాప్తియానపునీ క ♦ ల్పక్షోణిజం బిచ్చు ద
బ్బరిపుంగోత్కులు సిపా నిన్నుఁ గనహా ♦ ద్భాగంబునం జేర్చి సుం
దర పాదాంబుజముల్ భజించు గుణవ ♦ ద్ధన్యు న్మహాభోగిగాఁ
గరుణం జేయు దశేషవాంఛ లిడి పే ♦ ర్మిం జంద్రమౌళీశ్వరా! 84

మ॥ శమనధ్వంసక! యెంతలో యముడు న ♦ న్నాధింపఁగాఁ గాలపా
శముత్రోఁ గట్టునో, యంతలో నభయము ♦ న్నందింపుమా? వేగ నే
మముత్రోఁగొల్తు విసష్టజీవునకు న ♦ మ్మం దేల నీప్రాపు నే
నమితానందముతోడఁ బొందితిని దా ♦ రా! చంద్రమౌళీశ్వరా! 85

మ॥ విషముం గ్రక్కెడు భీమపన్నగము ల ♦ న్విఖ్యాతిఁ గన్పట్టి మ
ద్విషయంబుల్గాని పేర్చు కాయముల ను ♦ ర్వింబెక్కుగాయంబు లా
మిష గన్పట్టఁగఁ బుట్టిన న్నమృతస ♦ మ్మోళంబునిం బోల్చు ను
న్మిషదంచద్రసదృష్టిఁ దేర్చు మిఁక స్వా ♦ మీ! చంద్రమౌళీశ్వరా! 86

మ॥ కరుణావారిధి వీవు మాసితతిఁ గ ♦ న్గంట న్గటాక్షించు చో
నరుదా! కాంక్షితసర్గముల్గాని మహీ ♦ యస్వంబుఁ దాఁగంట ము
ష్కరసంసారభయంబు నాఁగ నను నీ ♦ కంట న్నమీక్షింపు మో
దురితారణ్య దవానలా! నిను భజిం ♦ తుం జంద్రమౌళీశ్వరా! 87

శా॥ దేవా! యెవ్వనిపాదము ల్గొలుతునే ♦ దిక్కెవ్వరం చెంచు దు
స్స్వ వాల్లభ్యముఁ గోరునా కితరుఁడు ♦ న్నే నిత్యదీనావనుం
డే విశ్వంబునఁ ద్వద్వియోగిజన మే ♦ ల్లీక్షించుఁగాంతా మయు
బీ విశ్వంబని గాంతుఁ ద్వన్మయము యుం ♦ చేఁ జంద్రమౌళీశ్వరా! 88

శా॥ నానారీతుల భక్తసంతతులఁ బు ♦ ణ్యాంబు ల్ఫలింపంగ నీ
శానా! ప్రోచితి వెందఱెందఱినో ? నన్ ♦ సం రక్షితుం జేయ జా
గౌనా న్యాయ్యము ? మందరంబు నటు మో ♦ యంజాలు తామేటికిన్
బూనంగాఁ బరమాణు వెంతలగు బా ♦ బూ ! చంద్రమౌళీశ్వరా!89

మ॥ ఘనదూరస్థుఁ డటంచు నెంచు నెడ నీ ♦ కమ్రోత్తమాంగంబు చు
ట్టు నదూరస్థము పుక్కపేరు, మఱిగో ♦ డుం బెంచెదే న్నీయెడం
గన నౌ హాలహాలంబు దుర్జనుల సాం ♦ గత్యంబు రూపించెదేఁ
జనునీయందు ద్విజిహ్వాధారణము మే ♦ శా! చంద్రమౌళీశ్వరా ! 90

మ॥ ఎటుదృష్టిం గడఁగింతు నేమనుదు నే ♦ నెచ్చోటవర్తింతు సం
కటభీతాత్ముఁడ నెందునిల్చితివొ దీ ♦ ను న్నన్ను రక్షింపు దు
ర్ఘట మీకార్య మటంచు నెంచకుము శ ♦ ర్వా! నీదరిం జేరితిన్
దటకాపాటును జెందఁజేయకుము వే ♦ ద్యా! చంద్రమౌళీశ్వరా!91

శా॥ నేల న్దొల్లుదునా యొడందప్పిదుల ♦ న్నిర్ఘాతముం గూర్తునా ?
కేలన్దుల్చెదనా శిరంబు తెగి దుః ♦ ఖత్వంబుతో నేడ్చుచా
భీలారావ మొనర్తునా మఱియు నె ♦ ట్టే! యేమి నేయ న్మహా
కాలా! భక్తుఁడఁ బ్రోవఁగాఁ దగుదు వే ♦ గం జంద్రమౌళీశ్వరా! 92

మ॥ శివ! శర్వా! శశిశేఖరా! మృడ! హరా! ♦ శ్రీకంఠ! మృత్యుంజయా!
భవ! దేవా! సుఖదా! మహేశ్వర! కృపా ♦ పాశీణ! నమ్రుఁడనై
తివరా! నన్గృపఁజూడు శంకర! కప ♦ ర్దీ! నీకు నేమ్రొక్కెదన్
దివిషద్వందిత సర్వకాలము పుల ♦ స్తీ చంద్రమౌళీశ్వరా! 93

మ॥ శరణం బా తరుణేందుశేఖరుఁడు వి ♦ శ్వస్తుత్యుఁడౌ శంభుఁడే
శరణం బా గిరిరాజకన్యక నమ ♦ త్సర్వామరీవర్గమే
శరణం బొండొకఁ డుండఁబో దనుచు నా ♦ స్వాంతంబునం దెంతుమీ
కరణంబిచ్చితి మేను మున్న హరికే ♦ శా! చంద్రమౌళీశ్వరా! 94

శా॥ అంబాధీశ! ప్రసన్నతం గను ప్రప ♦ న్నార్తిచ్ఛటాచ్ఛేదకా!
సాంబా! శూలి! ప్రసన్నతం గనుము వి ♦ శ్వారాధ్య! విశ్వేశ్వరా
బింబాస్థాన! ప్రసన్నతం గను శివా! ♦ భీమేశ! గంగాధరా!
తుంబుర్వర్చిత! యేలు సంసరణ భీ ♦ తుం జంద్రమౌళీశ్వరా! 95

శా॥ నీవల్ల న్జనిఁ గాంచు నీజగ మెుగి ♦ న్నీయందె నిల్చుం దతన్
శ్రీవాల్లభ్యముఁ గోరి మించుఁ దుదిఁదా ♦ క్షీణించు నక్లో వినా
శావిర్భాతులు నీయెడం బడయు స ♦ స్వాఘంబు భూమింబలెన్
శ్రీవిద్వజ్జన మానసాబ్జ వసతీ! ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 96

శా॥ లోకేశుండు సురేశ్వరుండు వసువు ♦ ల్రుద్రు ల్దిశానాయకు
ల్నాకుల్ యక్షులు సిద్ధసాధ్యులును గం ♦ ధర్వ ల్నదీసంఘము
ల్నాకాకఃప్రవిరోధు లంబుధులు గాం ♦ తారంబు లయ్యద్రులున్
లోకాధీశ్వర! సర్వము న్నిలుచు నీ ♦ లోఁ జంద్రమౌళీశ్వరా! 97

శా॥ నీమాయాకలితంబు విశ్వ మిది వ ♦ ర్ణింపంగ నీయందె యి
చ్ఛామాత్రంబునఁ దోఁచునంచు బుధు లెం ♦ చంజాలి రీమాద్రి స
ద్ధామా! రజ్జువునం దహిభ్రమయ కా ♦ సధ్యంబె యీమర్మ మో
స్వామీ! ముక్తుఁడౌఱుంగునంద్రునిగమా ♦ శ్వా! చంద్రమౌళీశ్వరా! 93

శా॥ తేజఃఖండముల న్జగం బఖిల మ ♦ ర్థిం బూర్తిఁగావించి బ
త్తేజోరాశివ కాఁ బ్రకాశిలుదు వో ♦ లింగూర్తి వద్దానికే
యోజమ్ముం ద్వదుపేక్షకత్వమున న ♦ ట్లో యేగు నీవిశ్వ మిం
కేశాడ న్గనరా దటం చనెద వ ♦ ర్మ్మి చంద్రమౌళీశ్వరా! 99

శా॥ స్థూలార్థంబు భరింప నల్పుఁ డెటు శ ♦ క్తుం డయ్యెడిన్ వింధ్యమున్
శైలం బెత్తఁగ స్తంబకీటమునకున్ ♦ శక్యంబె యీవిశ్వమే
లీలన్ దాల్చితో గర్భయంత్రమునఁ ద ♦ ల్లింగంబు నీమాయ యం
చోలిం గాంచితి సత్యమియ్యది ధృతేం ♦ దూ! చంద్రమౌళీశ్వరా! 100

మ॥ ఎటు లారజ్జువున న్భుజంగము భయం ♦ బెంతే వెసం గూర్చు నం
తటఁజూడ న్గనరాదు లేదు విలయ ♦ స్థానంబుఁ దాఁ జెందదే
మిటి కీజాడఁ బొనర్చి తీజగము నె ♦ మ్మి న్నైజమాయాంధ్య మం
చిటు నీమూర్తి నిఁ గాంచి మించితి విషా♦శీ! చంద్రమౌళీశ్వరా! 101

మ॥ అవిచారాంచిత మిద్ది లోకముల కె ♦ స్వాధారభావం బుమా
ధవ! నీదేహము గాంచునంట మదవి ♦ ద్యం గల్గె నెన్నంగ నీ
కెవ్వనే దేహము? నీవు పూర్ణుఁడవు ని ♦ త్యానందరూపుండ నో
శివ! మత్స్వాంతసరోజగేహావసతీ! ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 102

శా॥ పూజేష్టంబులు పూర్తదానములు నాఁ ♦ బొల్పారు భవ్యక్రియ
ల్తేజస్విత్వము గోరు మానవులకుఁ ♦ దివ్యత్ఫలం బిచ్చునం
చోజరి బల్కెడి పల్కులే మృషలు నా ♦ నోనాన్న! నీకన్న వే
రే జాడంగన రాఁడొకండు యెటులెం ♦ దేఁ జంద్రమౌళీశ్వరా! 103

శా॥ అజ్ఞానుల్ మునులా? వచింత్రు బహుపూ ♦ జాచార బాహ్యక్రియల్
ప్రజ్ఞంగూర్చి పొనర్చువాఁడు గను భ ♦ వ్యస్థాన మన్పల్కు డి
వ్యజ్ఞానం బటుగాక గల్గునె యమూ ♦ ర్తా! నీకు భోగేచ్ఛ నో
సుజ్ఞానం బొడఁగూర్చి చేయుము కృతా ♦ ర్థుం జంద్రమౌళీశ్వరా! 104

మ॥ ఒకమాలూర దళంబో; కొంచె ముదకం ♦ బో; కొంచు భక్తాళికి
న్సకలంబాసిరి సంఘటింతు వనుట ♦ ల్సత్యేతరంబు ల్మహా
త్మక! విద్యాస్పద మిద్ది గాదనుచు నెం ♦ తు న్మామకస్వాంత మం
దొకట న్నీపదపద్మము న్గొలుతు నే ♦ నో చంద్రమౌళీశ్వరా! 105

శా॥ విశ్వం బెల్లెడ దిక్కుల న్విదిశల ♦ న్విఖ్యాతితో నుందు వో
పశ్వారూఢ! పురాణపూరుషుఁడవై ♦ బ్రహ్మాదు లగ్గింప నీ
యైశ్వర్యం బిదిగాదు నా న్ఘటమునం ♦ దాకాశ మెట్లట్లు నీ
శశ్వద్భావమె సాక్ష్య మిచ్చెడుఁ బరే ♦ శా! చంద్రమౌళీశ్వరా! 106

శా॥ ఆకాశంబుననున్న సూర్యుఁ డెటు ల ♦ య్యై నీరపాత్రంబులం
దేకాత్ముండె యనేకభావమున నెం ♦ తే నొప్పుచొప్పించి యా
స్తోకు న్ని న్నఖిలాంతరాత్ములను సం ♦ శోభింతువం చందు నో
శ్రీకాంతార్చిత పాదపద్మయుగళా! ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 107

శా॥ పుట్టింపం బెనుప న్లయంబొనరుప ♦ న్భూతేశ! నీకర్జమె
ప్పట్టుం న్మెట్టఁగఁ బో దట్లైనఁ దనుభృ ♦ ద్వారంబు నాద్యంతమై
మట్టుస్మీఱు నదృష్టపుంజముల న ♦ మ్మర్రాని యద్దానిఁ గ
న్పట్టం జేయుదు స్వప్నముంబలె సురూ♦పా!చంద్రమౌళీశ్వరా!108

శా॥ స్థూలంబై మఱి సూక్ష్మమై జడమునై ♦ శోభిల్లు దేహద్వయం
బేలాగాంచును జేతనత్వ మధి వి ♦ ద్యేశాన! యద్దాన దా
నోలిం గూర్చెడి వేద మెప్పు సుఖదుః ♦ ఖోక్తిం ద్వచారోపణం
బోలక్ష్మ్యర్చితపల్లవాంఘ్రియుగ! శం♦భూ! చంద్రమౌళీశ్వరా!109

శా॥ శ్రీకంఠాయనమో నమోస్తుగురవే ♦ శ్రీసచ్చిదంభోధిహా
సాకారాయ నమ స్సమస్తకలుషా ♦ హారాయ తుభ్యంనమః
సాకారాయ పరావరత్వమహతే ♦ వ్యాయోగకర్త్రే నమ
శ్శ్రీకాలాయ యటంచు నిన్బొగడుదుర్♦శ్రీచంద్రమౌళీశ్వరా!110

మ॥ ఉపమన్యుండు రఘూద్వహుండు నిను వి ♦ ధ్యుక్తప్రకారంబు త్వ
త్కృప గాంచ న్వినుతించి మించిరను ప్రా ♦ గ్గీతోక్తి నాలించి యా
త్రిపదీ న్నామకవాణి తదుచ్చిర మా ♦ ర్గం బంది తచ్ఛాయ గ
ల్గి పృథూల్లాసమునీకుఁగూర్పుత కపా♦లీ! చంద్రమౌళీశ్వరా! 111

మ॥ అన్నం బన్న విసంబు, భూషణము లా ♦ హా! సర్పము ల్వస్త్రమి
ల్లైన్న న్వారణకృత్తి సేలువకె యు ♦ ర్వే! వ్యాఘ్రపుం దోలు, సం
సన్నంబైన వృషంబు వాహనము నీ ♦ సౌభాగ్యమేగోర లే
కున్నాఁడర్ధృఢభక్తియిమ్మొకఁడా శం♦భూ! చంద్రమౌళీశ్వరా 112

మ॥ కరు లిమ్మంటినొ బంధురాశ్వగణముం ♦ గాంక్షించినానేమొ బం
గరు తేరు ల్గరుణింపుమంటినొ యనే ♦ క శ్రీ విడంబించు కా
ల్వుర నిమ్మంటినొ రాజ్యభోగముల కూ ♦ ర్పుంగూర్పుమన్నాడనో
స్థిరభక్తిస్థితిఁ గాంక్ష సేసితి శివా! ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 113

శా॥ భోగుల్గోరను? గోరనే బిరుదము ♦ ల్బాహావళుల్ గోరనే?
లాగుల్గోరను గోరనే కుబుసము ♦ ల్లావణ్యముం గోర సు
శ్రీ గుణ్యాంబులుఁగోర గోర భూమి ల ♦ క్ష్మీలాలనోల్లాసముల్
త్యాగం బింతకు భక్తిఁగూర్చుమె కద ♦ య్యా! చంద్రమౌళీశ్వరా! 114

మ॥ తొలుత జ్జన్మము లెత్తినాఁడ నటులే ♦ దోషంబులార్జించి నాఁ
డ లవంబేనియుఁగూర్చ రీర్ష్యమొయినం ♦ దల్లండ లెవ్వారు ని
ర్మలమౌనీవర భృత్యభావమును నే ♦ మం బొప్పఁ గైకొంటి నే
ఁడలఁతు న్లోకము గడ్డిపోచగను వం ♦ ద్యా! చంద్రమౌళీశ్వరా! 115

మ॥ అరదంబు ల్గరు లశ్వము ల్బలస్థై ♦ న్యశ్రేణి ధీరత్వము
ధరణీశత్వము వేదపారగత శా ♦ స్త్రప్రౌఢవాగ్ధోరణీ
గరిమం బుజ్జ్వలకాంతి సత్త్వము మహా ♦ కావ్యప్రణేతృత్వ మిం
పుర హించు న్భవదాశ్రితావళికి బా ♦ బూ! చంద్రమౌళీశ్వరా! 116

మ॥ సరసాహ్లాదివచశ్చమత్కృతి మన ♦ స్సంతోషసంవృద్ధి సుం
దరకన్యాపరిచర్య పండితకవీం ♦ ద్రత్వంబు శైవత్వ మీ
శ్వరపూజాపరిపాటి రాజసభ ♦ ద్వాల్లభ్య మీశిత్వముం
బరగుం దావకభక్తసంతతికి సాం ♦ బా! చంద్రమౌళీశ్వరా! 117

మ॥ పగలుం ద్రాతిరి నీసమర్చనము శం ♦ భ ద్భక్తిసంయుక్తి నే
ను గతాహంకృతి సేయఁగా నటిఁగి న ♦ న్నుం బ్రోవ శంకించెదే
నిఁ గలిందావకభక్తసంఘమున వ ♦ న్నెల్వాసులుం గ్రుంగు నీ
కుఁ గరంబబ్బెడిఁ జెడ్డపేరు శ్రుతభి ♦ క్షా! చంద్రమౌళీశ్వరా! 118

మ॥ హరిదశ్వుండుదయింప నగ్నిభమృగాం ♦ కాదిప్రభాపుంజము
లరణీభృద్గుహలందు దూఱుగతి నీ ♦ దాస్యంబు సద్భక్తిభా
సురమార్గంబునఁ దేజరిల్లఁగను సం ♦ శ్రోతవ్యమంతవ్య మం
త్రరహస్యజ్ఞత లూర కే చనును శ ♦ ర్వా! చంద్రమౌళీశ్వరా! 119

మ॥ అరిషట్కంబు దృణీకరించియు యమా ♦ ద్యష్టాంగసంపత్తి ను
ద్ధురయోగాభ్యసనం బొనర్చియు మహా ♦ స్తోత్రంబులం బాడియుం
గొలఁగాఁ డెట్టిఁడయేని భక్తివిధి నీ ♦ కుం గూర్చు ముక్తుండునై
పరగుం బెద్దలమార్గ మియ్యది సురా ♦ పా! చంద్రమౌళీశ్వరా! 120

మ॥ జనుఁ డెవ్వండు భవత్సమక్షమునఁ దే ♦ జఃపుంజమాలానురం
జనమౌ దీప మొసంగు నాతనికి ది ♦ త్స న్సర్వమోహాంధకా
ర నిబర్హ ప్రదమూనుషంగికము బా ♦ రమార్థ విజ్ఞాన సం
జనజ్ఞాన మొసంగి యేలెదవు త్ర్య ♦ క్షా! చంద్రమౌళీశ్వరా! 121

మ॥ భవదీయామల పాదపంకజయుగి ♦ న్భక్తిం బ్రపూజించు పు
ష్పవరేణ్యంబునఁ గల్గు సప్తజలధి ♦ ప్రావేష్టితాఖండ భూ
మి విధానంబున మూఁడుకాలముల నె ♦ మ్మిం గొల్చులోకాళికిం
దవులంజాలెడి పున్నె మట్టిఁడు మహా ♦ త్మా! చంద్రమౌళీశ్వరా! 122

మ॥ అరివీరోన్మద కుంభికుంభదళనో ♦ ద్యద్రౌద్ర పంచాననం
బురుదుష్ప్రాప్తిక్షయ శరీరబంధగిరిప ♦ క్షోన్మచ్ఛేద సంభావ్యంతె బా
ధుర వజ్రంబు పురార్తితీవ్రదురితో ♦ ద్యద్భాతాబ్దసంవాత మో
పరమేశా! భవదీయభక్తి యగుఁగా ♦ సం జంద్రమౌళీశ్వరా! 123

మ॥ సురభూమీసుర మర్త్యసంఘముల నె ♦ చ్చోఁ గాని దౌర్భాగ్య వి
స్ఫురజంతుచ్ఛటలందు నేనొకట సం ♦ సిద్ధించుఁ బూర్వార్జిత
స్థిరపాపంబులఁ జేసి జన్మ మిట నా ♦ చేతిస్సు నీపాద ప
ద్మరజోలేశము భక్తిఁ గోరుకొనుఁ గా ♦ తం జంద్రమౌళీశ్వరా! 124

శా॥ ప్రాతర్వేళ మునింగియేట విధివ ♦ ద్భస్మంబు మై దాల్చి సం
ప్రీతి న్మాలికలం ధరించి నిను న ♦ ర్థి న్వాయుహ స్తంబునం
జేతోమోదముమీఱఁ గొల్చి పరముం ♦ జెందు న్మహాభక్తుఁడో
శీతాహార్యకుమారికారతిపతీ! ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 125

శా॥ భావిస్వార్చనకుం బ్రసూనహరణ ♦ ప్రారంభ సంరంభ మం
దావంత్రైన సుతీక్ష్ణకంటకహతిన్ ♦ వ్యావిద్ధుఁడౌవాఁడు దా
నేవంబొందఁడు కాలకింకరకృతా ♦ హీనాష్టకష్టాప్తి నే
నా వాల్లభ్యముగోరు భక్తుఁడ సుధ ♦ న్వా చంద్రమౌళీశ్వరా! 126

మ॥ ప్రసవాలంకృతి నీదులింగమునకున్ ♦ భక్తిం బ్రకల్పించు మా
నిసిశంభోజయ! శర్వశంకర భవా ♦ నీనాథ! మాంపాహి యం
చు సతంబాడెడువాఁడు గాంచఁడెపుడున్ ♦ క్షోభాఢ్యమామాత్మ కు
క్షిసమారోహణ మంద్రు పెద్దలు విపా♦శీ! చంద్రమౌళీశ్వరా! 127

మ॥ అమితాంహఃకరణంబు విప్రవధయుం ♦ జావంత చింతింప వు
త్తమనారీజనహాని దోస మని డెం ♦ దంబందు లెక్కింప వే
మి మతంబో? కులధర్మభంగముల నె ♦ మ్మింజూడ వెట్లైన స
న్నమదిష్టేష్టవరప్రదానవిధి యు ♦ న్నం జంద్రమౌళీశ్వరా! 128

శా॥ చేయంగాఁ దగు కృత్యమెద్దియును నే ♦ జేయంగలే దెప్పుడున్
జేయంగూడని చెద్ద మంతయును జే ♦ చేతన్నమర్థించితిన్
హేయం బీదోసఁగుం బొకార్పఁదగు దీ♦వే యెంచి యెట్లేని యున్
శ్రీయు న్భక్తియుముక్తియు న్మెలుపుమో♦శ్రీ చంద్రమౌళీశ్వరా!129

శా॥ పీటిం దావకపాదపీఠికపయి ♦ న్వే భక్తి నర్పించి యె
ప్పాటన్ భక్తుఁడ నైన నాయెడఁద నీ ♦ పారమ్యసిద్ధాంత సం
ఘాటం బొప్పునటుల్ సతంబు ధృతి మిం♦చం జేయఁ గొల్తున్నదీ
జూటా! గోపతిఘోట! వందనములం ♦ దుంజంద్రమౌళీశ్వరా!130

మ॥ శతకంబుల్ రచియించినాఁడ మును నే ♦ సద్భక్తి రాజేశ్వరాం
కిత మొక్కండు త్రిరాత్రమాత్రమున నో♦కృష్ణార్చితా! యిప్పుడం
చితమార్గంబున నీపయి న్శతకముం ♦ జేయించి తీవౌర! నా
సుతు శ్రీకంఠునిఁ బ్రోవుమీ భృతసుధాం♦శూ! చంద్రమౌళీశ్వరా!

మ॥ అలశ్రీశుండు మఱందియై లలిత భా ♦ ర్యారత్నమై వెండి మే
ల్మల యావాసమునై, ధనేశుఁడు మహా ♦ మాన్యుండు సన్మిత్రుఁడై
బలుహారంబట్టులగట్టు దివ్యధనువై ♦ భాసిల్లు నీగొల్వ బ
ల్కులుము ల్గల్గవె పాపజాలములు ద్రే♦లన్ జంద్రమౌళీశ్వరా! 132

శా॥ దేవేశ న్నివు నీబ్రిమాదమున నా ♦ దేవాళితో నెవ్వఁడే
భావించు న్సము గాఁగ మానసమునన్ ♦ వాదించు నవ్వాఁడు దా
నీవిశ్వంబున దుఃఖపుంజముల నె ♦ న్నేఁ గాంచి యంతంబునన్
ఠావుంగైకొను రౌరవాది శితికం♦ఠా! చంద్రమౌళీశ్వరా! 133

మ॥ వసియింప న్గృహమొండు, నందు భుజియిం ♦ప న్జాలుసస్యంబు సా
ధ్వసముం ద్రోవ న్కృపావలంబనము దీ ♦ వ్యత్కావ్యనిర్మాణవుం
బస, వైదగ్ధ్యముఁ దావకీనచరణా ♦ బ్జధ్యానసన్నిష్ఠ నీ
యసకృద్వీక్షణ సంపదం గలుగు దే ♦ వా! చంద్రమౌళీశ్వరా! 134

మ॥ భృగుపత్నిం దెగటార్చి చక్రమున నా ♦ విష్ణుండట న్మౌని పె
ల్లుగఁ గోపించి శపింప దాన నతఁ డి ♦ ల్లుంబాసి నానావతా
రగతుండై యిలజన్మమెత్తి నిను దో ♦ రంబైనభక్తి న్మహా
రగభూషున్ భజియించె నంద్రు మును లా♦రా! చంద్రమౌళీశ్వరా!

శా॥ తామచ్ఛంబయి మ్రుచ్చుసోమకపదుల్ ♦ ధ్వంసించి వేదశ్రుతి
స్తోమం బావిధికిచ్చి యచ్చట గిరీ ♦ శున్ నిన్ బ్రతిష్ఠించి ని
త్యామోదంబున మించె శ్రీశుఁడని వి ♦ ద్యారాశి వ్యాసుం డనెన్
శ్రీమంతు న్నిను బోలు దేవత లిఁకే ♦ రీ? చంద్రమౌళీశ్వరా! 136

శా॥ తామేతై కమలామనోహరుఁడ మ ♦ ర్త్యశ్రేణి దైత్యాళు లు
ద్దామప్రక్రియ సంద్రమున్ దరుచునం ♦ తన్మగ్నమంథాద్రి నెం
తోమోదంబున నెత్తి ప్రాగుదధియం ♦ దున్ నిన్నుఁగూర్మేశునిన్
శ్రీమీఱంగఁ బ్రతిష్ఠ సేసి కొలిచెన్ ♦ శ్రీచంద్రమౌళీశ్వరా! 137

శా॥ ఆవిష్ణుండు వరాహమై వడి హిరణ్యా ♦ క్షున్ హతున్ జేసి బల్
ఠీవిన్ లోకమునేలి శ్రీగిరిపయిన్ ♦ లింగప్రతిష్ఠన్ లస
ద్భావస్ఫీతిఁ బొనర్చి యొప్పెనన నీ ♦ భాగ్యంబు దేవాళియుం
దేవారేఁ గనలేరు నిక్కముకవా ♦ లీ! చంద్రమౌళీశ్వరా! 138

మ॥ ఘనుఁ బ్రహ్లాదుని బ్రోవఁ గంబమున నీ ♦ కన్ నారసింహాకృతిన్
జననంబంది హిరణ్యపూర్వకశిపున్ ♦ సంహారమున్ జేసి శే
షనగాగ్రంబున స్వీయనామమున నిన్ ♦ స్థాపించి పూజించె నం
చనిపల్కన్ గద బాదరాయణి మహా ♦ త్మా! చంద్రమౌళీశ్వరా! 139

శా॥ శ్రీలక్ష్మీశుఁడు బిచ్చమెత్తుకొనఁగా ♦ శ్రీవామనుండై బలిన్
లీలన్ గోరి పదత్రయంబుఁ గొని వా ♦ నిం గ్రిందికిం ద్రోచి దే
వాళిన్ బ్రోచి సురేంద్రుగాచి శివుని ♦ న్నాద్యున్ స్వనామాంచితున్
బోల న్నిల్పె హిమాచలాగ్రమున శం ♦ భూ! చంద్రమౌళీశ్వరా! 140

మ॥ కమలానాథుఁడు రాముఁడై విబుధలో ♦ కం బెన్న జన్మించి దు
ష్టు మదాంధుం దశవక్త్రుఁ బేరడఁచి శి ♦ ష్టుం గుంభజుం గొల్చి శై
వమతంబున్ గొని రామలింగవిభు నిన్ ♦ భక్తిం బ్రతిష్ఠించి చెం
దె మహాతేజము వందనంబులు కప ♦ ర్దీ! చంద్రమౌళీశ్వరా! 141

మ॥ యదువంశంబున రౌహిణేయుఁడన వి ♦ ష్ణ్వంశంబునం బుట్టి దు
ర్మదరాత్రించరసంఘమున్ దునిమి ధీ ♦ రశ్రేణిఁ బోషించి కా
శిఁ దగన్ లింగము శాస్త్రపద్ధతిఁ బ్రతి ♦ ష్ఠించెన్ మహోత్సాహసం
పద భక్తాళికిఁ గూర్చుతేఁడ! శివనా ♦ మా! చంద్రమౌళీశ్వరా! 142

మ॥ వసుదేవాత్మజుఁడై జనించి హరి వి ♦ శ్వస్తుత్యు దూర్వాసు సా
ధ్వసభక్తు ల్దగఁ గొల్చి శైవుఁడయి వే ♦ దధ్యేయమామూర్తి నిం
పెసలారన్ నిను గాశికా పురిని ని ♦ త్యం జక్రముం గాంచె శ
త్రుసమూహంబును నొంచె మించె వృషకే♦తూ! చంద్రమౌళీశ్వరా!

శా॥ భూతశ్రేణి సరస్వతీవిభుఁడవై ♦ పుట్టింతు లక్ష్మీపతి
ఖ్యాతిం బ్రోతువు పార్వతీసహచరా ♦ ఖ్యన్ హానివాటింతు వే
ప్రీతిన్ స్థితిని భీతిఁ జెందవు, మహా ♦ ద్రిస్తవ్యనైర్గుణ్య సం
జాతానందసురూపశాలివి మహే ♦ శా! చంద్రమౌళీశ్వరా! 144

శా॥ నీలింగం బెదఁదాల్చ నీకథవినన్ ♦ నీపాదనిర్మాల్య ని
ష్ఠాలాలిత్య మెఱుంగ నీదుభజనా ♦ స్థం గాలముంబుచ్చ నీ
లీల ల్గాంచఁగ నీసమర్చితము నో ♦ లిం జెంద రక్షింపవే
శీలం బీనెఱి జన్మజన్మములకున్ ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా ! 145

మ॥ శ్రుతి రుద్రుం డొకఁ డన్న నొల్లక వరి ♦ ష్ఠు న్నిన్నుఁ బూజింప దు
ర్మతిఁ బౌరాణికగాథలన్విని సుతా ♦ రంబన్న కే యన్యదే
వతలం గొల్తురు ధూర్తు లిక్కలిఁ దరిం ♦ పం బోరు సత్యంబు నీ
వ్రతులంగూర్చి భరింపవే శరణులు ♦ గ్రా! చంద్రమౌళీశ్వరా! 146

మ॥ శతమన్యుప్రముఖాఖిలామరసుమ ♦ స్తన్యస్తసద్భూషణాం
చితమాణిక్యకిరీటదీధితిలస ♦ చ్ఛ్రీపుంజనీరాజితాం
ఘ్రితలుం డెవ్వఁడు నిన్నుబోల విబుధ ♦ శ్రేణి న్విలోకింప నీ
జత నీవే యని నమ్మికొల్చెద గిరీ♦శా! చంద్రమౌళీశ్వరా ! 147

మ॥ నినువర్ణించెడువాఁడు సత్కవి సదా ♦ నీనామసంకీర్తనం
బును గావించెడువాఁడు యోగి స్వీకయా♦మూర్తి న్హృదంభోజమం
దున పూజించెడువాఁడు భక్తుఁడు కృతా ♦ స్థుం డెల్లచో నీదుప్రా
పున మేల్గాంచెడువాఁడు పల్కితి నిజం♦బున్ జంద్రమౌళీశ్వరా! 148

శా॥ ఏనఃపుంజపరంపరావలయుతా ♦ హానాష్టకష్టాలి దు
ష్టానిష్టగ్రహతారకాప్రణిహితా ♦ త్యర్థాధిరింఛోళి జు
ష్టానేకామయపాళి నీభజన మ ♦ త్యాసక్తిఁ గావించు న
వ్యానిం జెందక దూరమేగెడిని దే ♦ వా చంద్రమౌళీశ్వరా! 149

మ॥ సుతు లవ్వీరకుమారభైరవ గణే ♦ శు ల్పార్వతీదేవి నీ
సతి తత్సోదరుఁ డిందిరావరుఁడు నీ ♦ సన్మిత్రుఁడున్ శ్రీదుఁ డా
శ్రితులున్ బ్రహ్మముఖామరుల్ పరిషవ ♦ శ్రీ నిట్లునున్నట్లు నీ
స్తుతి యస్మాదృశసాధ్యమే వృషభ కే♦తూ? చంద్రమౌళీశ్వరా! 150

మ॥ సమహోత్సాహము మీఱ నీశతకము ♦ న్శార్దూలమత్తేభ వృ
త్తములం గూర్చితి వీరభద్రుఁడను నీ ♦ దాసుండ నాపల్కులం
దు మహాదోషములుండునే? సకలపూ ♦ ర్ణ స్భక్తిఁ గొండాడుచో
ట మహేశా! క్షమియింపనౌనుఁగ ఆకం♦ఠా! చంద్రమౌళీశ్వరా! 151

మ॥ తరమా! మాదృశులైన వారలకు నీ ♦ దాక్షిణ్యసంపత్తి ను
ర్వర వర్ణింపఁగ సంస్తుతింపఁగ బుధేం ♦ ద్రశ్రేణి వెన్నాఁడ వే
గిరి మాభక్తుని వీరభద్రకవి నీ ♦ క్రేగంట నీక్షింపు మో
వరదా! జగ్గయపేటవాస! గురుదే ♦ వా! చంద్రమౌళీశ్వరా! 152

మ॥ శతకం బిద్ది పఠించువారలకు స ♦ త్సంతానము ల్గల్గు దీ
ర్ఘతరాయుష్యము గల్గు బుద్ధియును బా ♦ రంబందు శ్రీమత్తయున్
సతముం జెందు బరమ్మునం గలుగు మో ♦ క్షశ్రీసమాలింగనో
న్నతిసౌఖ్యంబు నిరంతరంబుగ ననం ♦ తా చంద్రమౌళీశ్వరా! 153

శా॥ ఆకాశాగ్నినిధీంద్రసంఖ్యలను హా ♦ ణాబ్దంబు పెంపొందఁగా
నీకై కూర్చితి భక్తి నీశతకము ♦ న్నే శ్రావణి న్దేవదే
వా! కైకొమ్ము భవత్సమర్చకుఁడ న ♦ త్యంతంబు మోదింతు నీ
శ్రీకైవల్య మొసంగ వేఁడెదను నే ♦ శ్రీ చంద్రమౌళీశ్వరా! 154

శ్రీ చంద్రమౌళీశ్వరార్పణమస్తు.

శ్రీచంద్రమౌళీశ్వర శతకము సంపూర్ణము.

